# ఈశ్వర

(కవితా సంకలనం)



సంపాదకులు

డా॥టి. శ్రీరంగస్వామి

శ్రీలేఖ సాహితి

రి.నెం. 2337/89

5-11-481, విద్యారణ్యపురి

వరంగల్లు - 506 009

# ఈశ్వర

కవితా సంకలనం

డా|| కె. ఎల్. వి. ప్రసాద్
హన్మకొండ - 9


సంపాదకులు

డా||టి. శ్రీరంగస్వామి



**శ్రీలేఖ సాహితి**

రి.నెం. 2327/89

5-11-481, విద్యారణ్యపురి

వరంగల్లు - 506 009

స్థాపితం: 1977

ప్రచురణ ఈశ్వర ఉగాది (8-4-1997)

## కవితా రసికులకు- - - - -

శ్రీలేఖ సాహితి, వరంగల్లును 1977లో స్థాపించి, 1989లో రిజిష్టర్డ్ కాబడి దిగ్విజయంగా నడుస్తున్న సంస్థ. రెండు దశాబ్దాలు పూర్తి చేసుకున్నది. శ్రీలేఖ సాహితి వెలువరించిన ప్రచురణలో ఇది ఇరువది ఒకటవది. ఉగాది కవితా సంకలనాల్లో ఇది అయిదవది. ఈ కవితా సంకలనాలు వెలుగు చూడడంలో పూర్తిగా కవులు పరస్పర సహకారమందిచడము ప్రథమ కారణం. సాహితీ సంస్థలలో ఆర్థిక వనరుల సంగతి అందరికీ తెలిసినదే. ఈ సారి మేం 150 మంది కవులకు ఉత్తరాలు రాసాం. కాని ప్రతిస్పందన మాత్రం అంతంతగానే ఉంది. ఈ సంకలనాల ఉద్దేశము కవులను, కవితలను పాఠకులముంగిట్లోకి తీసుకొని వెళ్ళడానికే గాని, స్వప్రయోజనమును ఆశించి మాత్రం కాదు. మా ప్రయత్నమును మన్నించి, మా పై నమ్మకంతో కవితలు పంపించిన కవివరేణ్యులకు మా వందన చందనాలు. మళ్ళీ ఉగాదికి మీరు చేయూత ఇస్తే మరొక కవితా సంకలనం ఇంతకంటే పుష్టికరమైనది తేవచ్చు అని మా ఆకాంక్ష.

"స్నేహం నీడ నిచ్చే చెట్టు లాంటిది" అన్న మా సూక్తికి చేయూతనిస్తున్న అందరికి మా కృతజ్ఞతలు. ఎందరో మహానుభావులు అందరికీ మా వందనాలు.

**పల్లేరు వీరస్వామి**
ఉపాధ్యక్షులు

**వరిగొండ కాంతారావు**
కార్యదర్శి

**శ్రీలేఖ సాహితి**
వరంగల్లు

---

ఇది శ్రీలేఖ సాహితికి ద్విదశాబ్ది సంవత్సరం

---

# కలివెక్కడ ?

**- ఆర్. రంగస్వామి గౌడ్**

ఏటేటా కలువులొచ్చినా !
మురికివాడలో యింటింటా
ఏటేటా కాన్పులు తప్పడం లేదు !

సుఖరోగాల వార్డులో
'బెడ్లు' చాలడం లేదు!

సారాయి కొట్లో
స్థలం చిక్కడం లేదు !
బడానాయకుల భవంతుల
పై అంతస్థులు ఆగడం లేదు !

సిటీలో చోటు దొరకని కాటకం
పరుగెత్తి పల్లెలో పెత్తనాలు పెట్టింది !
పూరిండ్లదూరి క్షుదార్తుల కేకల
పరవశించి బర్హిలా నర్తిస్తోంది !



పశువుల పాకల జేరి
మూగజీవుల కన్నీటి ధారల్లో
తలంటు పోసుకొని
తృణశూన్యగాళ్లలో
కురుల నారేసుకుంటోంది

కర్షకుల నిలయాల్లో కాలూని
అడుగంటిన ధాన్య పాతర్లలో
జాతర జరుపుకుంటోంది !

SRBC Dn 3-4.
కోయిలకుంట్ల,
కర్నూలు-518134

# అవిశ్రాంతం

-శీలం రాజేశం

నడుస్తున్న పాదాలు
పాదాల గోలలో కాలుష్టకుండ
నవ్యవసంతోత్సవాగమన దారుల్లో
ఆకాశానికి ఎగిసే ధరలు - జీవితాన్ని
ఎంతగానో క్రుంగదీస్తున్నా
పయనం ఆపని పాదాలు !
పల్లె - పట్టణాల
రాయి రప్పల దారుల్లో
కయ్యల్లో ముల్లు గొయ్యలు గ్రుచ్చిన
రక్త సిక్త మయ పాదాలను
రాలే కవోష్ణ కన్నీటి ధారల్లో
కడుగుతూ..కడగండ్లను మోస్తూ
జనారణ్యంలో..నోటి కాడి ముద్ద
కాకుల పాలైనా..ఏదారి లేని
ఎడారి తుఫానులో
కాలే ఇసుక ముఖాన కొట్టినా
కాలగతిలో శిథిల శకలమై
శ్రమ దోపిడి చిహ్నమై
అన్ని దిక్కుల్లో స్వేద జల చుక్కల్ని
తనలోనే నిమజ్జనం గావించుకుంటు
నడుస్తూ [illegible] [illegible] పాదాలు !!

5-10-29, లష్కర్ బజార్
హన్మకొండ-506 001

# డబ్బు ముఖాలు !

- అన్వర్

ఆలోచనా గుమ్మంలో కూర్చున్నప్పుడు
అంతర్మపు దొంతరల్లోంచి ఒక్కొక్కరే
దూరం దూరంగా, హడావుడిగా
మనుష్యజాతంతా ఏదో తరుముకొస్తున్నట్టు
దేనికో పరుగులు తీస్తున్నట్టు
కంటి తెర మీద ఆగి కదులుతున్నట్టుగా
అస్పష్టంగా...అపరిచితంగా......
కౌగిలింతల్లేకుండా, కరస్పర్శల్లేకుండా
మనిషికి మనిషికి మధ్య మాటల్లేకుండా
మట్టి వాసన లేకుండా
హావ భావ ప్రకటన అద్భుతంగా వుంటుంది
మనుష్యులు ఏనిమేషన్ చిత్రాల్లా...
కార్టూన్ బొమ్మల్లా...
వింత జంతువుల్లా...మూగ మూగగా !
మనుష్యుల చుట్టు డబ్బు వలయం
టీవిలో కోల్గేట్ పేస్ట్ చుట్టూ ఏర్పడే రక్షణవలయంలా !
గిల్ట్ బొమ్మలకు బంగారు పూత పూసినట్టు
మనుష్యుల ఒంటి నిండా డబ్బు తాపడమై
కొన్ని రూపాయి నోటు ముఖాలు !
కొన్ని వంద, ఐదు వందల నోటు ముఖాలు !
మిగిలినవి........... చిల్లర ముఖాలు !

లాబ్ టెక్నీషియన్ (MPHC)
ధర్మసాగర్,
జిల్లా వరంగల్- 506 142

# మరుపు

- యం. భండారి

అంతరాంతరాల అంతెంతో
కొంతైనా చూడాలని
కంతల మయమైన బొంతను
కవచంలా కప్పకుని
పంచకళ్యాణి గుఱ్ఱ మెక్కి
దౌడుతీసా, దౌడు తీసా
దిక్కులెరుగని దిసలవైపు
కంట్రోలు చేసే కళ్లెంతో కాదు
ఇంటికి పెట్టాల్సిన గొళ్లెం మరచి

333/డి, సిఐబి కాలని
కాచిగూడ, హైద్రాబాద్ - 27

# శిబి చక్రవర్తులు

- ఆర్ద్యాబ్

కన్నీటి ప్రపంచంలో
కలం కదం తొక్కుతున్న మరుక్షణం
నా ఊహ గవాక్షం
పంజరం విడిచిన పావురాయి
రాలిన కేకలన్నీ
గరళం తాగిన గింజలు
దైన్యంగా దిక్కులు సారిస్తున్న చూపు
నిరంతరం పదునెక్కుతున్న పాట.
తప్పటడుగులన్నీ శిలలను
ఒరుసుకు ప్రవహిస్తున్న జలపాతాలు.
నిశీ గజరాజులకు
వేకువ పంజా గుర్తులే అంకుశాలు
మెరుపులా తుళ్ళి పడే, స్వేద చినుకులే
పుడమిన అవతరించే 'శిబి చక్రవర్తులు'

ఎల్. రత్నాకర రెడ్డి
గంగిపెల్లి, తాడికల్,
కరీంనగర్ - 505 474

# సిపాయి

- బి. వేణుగోపాల్

హిమ శిఖరాల మంచుగడ్డల్లో
ఒయాసిస్సులు కరువయ్యే ఎడారుల్లో
నిప్పులు కురిసే వేసవిలో
వడగళ్ళు కురిసే వానలో...
గుండెల్లో సుడిగుండాల హోరు దాచుకొని
తూట్లు పొడిచే తుపాకి చేత బట్టి
కన్నతల్లి క్షేమం కన్నా
ప్రేమించే భార్య కన్నా
తేనె పలుకుల బిడ్డ కన్నా
కనిపించని దేవుని కన్నా
జన్మభూమి రక్షణ కోసం
పుణ్య భూమి నవ్వులకోసం....
కళ్ళల్లో...
నెత్తుటి దీపాలు వెలిగించుకొని
రాత్రింబగళ్ళు
సరిహద్దుల అం...
మనకోసం అతను .

లైబ్రేరియన్, ఆర్ట్స్ అండ్ సైన్స్ కాలేజి,
ఆదోని, కర్నూలు - 518302

# కాదు కాదు కాదు

*- బాసిరి సాంబశివరావు*

కన్న వారిని గౌరవించడమంటే

బతికుండగా - బాధపడకుండా

చూడడం కాని

చనిపోయినాక - దినాల ఖర్చు

ఘనంగా చేయడం కాదు.

భాగస్వామిని - ప్రేమించడ మంటే

ఉన్నప్పడు - ఏడిపించక పోవడం కాని

పోయినప్పడు - ఏడవడం కాదు

సంతానాన్ని - సంతృప్తి పరచడమంటే

చేరవలసిన గమ్యానికి

దారి కల్పించి చేర్చడం-

దానికై దిద్ది తీర్చడం-కాని

కోరిందే తడవుగా

అడిగిందల్లా యిచ్చి

ఆగం చేయడం కాదు.

గ్రా: ముప్పారం, మం॥ ధర్మసాగర్
జిల్లా: వరంగల్ - 506 142

# రావాలి వసంతం

- కవిత భరద్వాజ

కోయిల సంతోషంతో పాడింది గానం

ప్రకృతి పులకరించి విరజల్లింది మల్లెల సువాసనలు

మేఘాలు కురిపించాయి వర్షాలు

నెమళ్ళు చేశాయి నాట్యాలు

రైతులు పాడు కున్నారు రాగాలు

భూమాత యిచ్చింది పంటలు

తుల తూగారు భోగ భాగ్యాలతో

వచ్చింది, వచ్చింది వసంతం

ప్రకృతి మాత ఇచ్చింది వసంతం

రాగన్నదర్వాజ
హన్మకొండ - 506 011

# మనం - జనం

- వరిగొండ కాంతారావు

నాకు మభ్యపెట్టడం మాయ జేయడం కొనుక్కోవడం
వచ్చు

నీకు
కాల్చడం కూల్చడం పేల్చడం
వచ్చు
చంపడం నీకు నాకూ సమంగా వచ్చు

ఇంక నాకు
అధికారం ధనదాహం మదమోహం
ఉన్నాయి

అదనంగా నీకు
వర్తమాన విధ్వంసం
భవిష్యన్నిర్మాణానికని చెప్పడం వచ్చు

నీకు అధికారం కావాలి
నాకది పోకుండా ఉండాలి

నీది అవిశ్రాంత పోరాటం
నాది అంతులేని ఆరాటం

పదవి లేకుండా
సేవ చేయలేని
సౌభాగ్యం మనది
అది నిజమని నమ్మే
దౌర్భాగ్యం జనానిది.

4-67, జీవన్‌మిత్రానగర్
విద్యారణ్యపురి
హనుమకొండ - 506 009

# సమయ త్యాగం

- జన్ను కుమార్

మానవతను...
కులాలతో కుమ్ముతూ
మతాలతో మసిచేస్తూ
శవరాజకీయాలాడుతున్నారు
మానవతపై
అ.జ్ఞానాంధకారాలు పులుముతున్నారు
ఈ చీకటి తెరలను తీసి
చిరు దీపం వెలుగిద్దాం
పల్లె పల్లెకు వెళ్లి
అక్షరాల శిక్షణనిస్తాం
సమస్యలను ప్రక్కకు పెట్టి
సమయాన్ని త్యాగం చేద్దాం
'వేలి" ముద్రల బ్రతుకులను
తీర్చి దిద్దుదాం
"వేలి" ముద్రలను వెలివేయిద్దాం
మానవతను కాపాడుకుందాం రండి

14-6-213
నిజాంపుర, మండిబజార్
వరంగల్- 506 002

# బేబికేర్ పిల్లలం

*- నమిలికొండ బాలకిషన్ రావు*

ఓ తల్లి
ఓ అమ్మ వినరమ్మా - వినరమ్మా నా గాధ !
పుట్టిన బిడ్డలు
కెవ్వు కెవ్వున ఏడ్చినను
పాల సీసాలు పట్టదు

జోల పాడదు
ఊయలూపదు
ఊదు పొగలు వేయదు
జిప్పి తీయదు....... దీవెనలివ్వదు

ఉగ్గు ఉంగాలు
అసలే నేర్పదు
అంబాడుట అసలే తెలియదు
ఆడుకొనుట ఏమి ఎరుగదు

బుడి బుడినడకలు నేర్పదు
బువ్వన్నం పెట్టదు
చందమామను చూపదు
బుగ్గ ముద్దులే పెట్టదు
కాళ్ల మీద పండబెట్టి స్నానం పోయదు
ఒడిలోన చేర్చదు, చను పాలివ్వదు
జో అచ్చితానంద జో ముకుందా
పాట పాడదు
అయిన మేము పసి పాపలం
బేబికేరు పిల్లలం
ఆపై మమ్మి - డాడీ పిల్లలం

6-7-42/ఎ, రాగన్న దర్వాజ
హన్మకొండ - 506 011

# నూతన సృష్టికి పునాది వెయ్యి

- "శ్రీ వీణ"

ఈ పురుషాధిక్య ప్రపంచం
నీవు అబలవంటూ
కష్టాలనేవి నీ ఖర్మంటూ
నీవదనమే వేదనా నిలయమంటూ
సీత-గీతదాటి నాడు, కష్టాల పాలయిందంటూ
నాలుగ్గోడల మధ్యన నిన్ను బందీ చేస్తుంటే
వేల ఖరీదు చేసి నీవు కొన్న వరుడు
నిను కీలు బొమ్మను చేసి నలిపేస్తుంటే
నీ ఉనికిని మటు మాయం చేస్తుంటే
పురాణాల్లో పూజించబడ్డ నీవు
ఆది పరాశక్తి వంటూ ఆలాపించబడ్డ నీవు
కన్నీళ్ళతోనే నీ కడుపును నింపుకుంటూ
బాధల సుడిగుండంలో భారంగా బ్రతుకీడుస్తూ
కాటేసిన కాలం పై కసిగా అలసటనెన్నాళ్ళిస్తావ్
అడవిన వెన్నెలనిస్తూ బ్రతుకెందుకు హారతి చేస్తావ్
సబలవై ...
ఈ అవస్థల వ్యవస్థను
సమూలంగా సమాధి చెయ్
అందరు సమానమంటూ
నూతన సృష్టికి పునాది వెయ్యి.

6-5-378
పవర్ హౌజ్ కాలని
గోదావరి ఖని, కరీంనగర్ జిల్లా. - 505 209

# అగ్ని గోళాల్ని తింటా !!

- మోహన్ కూరపాటి

జబ్బు పడిన దేహాల్ని జల్లెట్లో జల్లించనా ?
చిరిగిపోయిన విస్తార్లకి సమ్మెటతో మాట్లేయనా
ఏడ్చి ఏడ్చి రక్తాన్ని కార్చిన కండ్లకి
చలిలో ఎండిన ఎముకను కొరుకుచున్న కుక్కకి
నా గుండెల్ని చీల్చి చూపనా ?
నా కలల కంకర రాళ్ళని బంగారు బాటగా మార్చనా ?
ఏదో తెలియని ఆవేశంతో నా ముఖాన్ని ముక్కలు చేసుకోనా ?
రాత్రి పూసి రాలే పువ్వులతో రాలిపోనా ?
లేని శత్రువుతో యుద్ధం చేసి నా క్షితికి నిప్పెట్టుకోనా ?
నవ్విపోదురుగాని నాకేంటి సిగ్గంటు నగ్నంగా నడిబజాట్లో నడవనా ?
అలల్ని అరి చేతులతో బంధిస్తా ?
తోక చుక్కల తోకల్ని కత్తిరించి భుజాన వేసుకువస్తా!
రాత్రి అంచుల్ని చెక్కి పలావు చేసుకుతింటా !
అరిగిపోయిన తోలు బూట్లకు నా చర్మాన్ని అరువిస్తా!
వెలిగే జ్యోతికి చమురౌతా
ఎలుకకు పిల్లిని సాక్ష్యం చేస్తా !!
దొంగల చేతుల్లోనే పగ్గాలు!! ఎరుకలసాని ఎరుక !!
ముసలిదాని కంటి చూపులు ? బూడిదలోని నిప్పులు
అందుకే, నేను అన్నం కాదు అగ్ని గోళాల్ని తింటా! ఐనా
పొద్దున్నే ముఖాన బూడిద పూసుకు కనిపిస్తా !!
కుక్కలు కొరుకగా మిగిలిన ఎముకలు ఏరుకోవడానికి !

తెలుగు విభాగం,
కాకతీయ విశ్వవిద్యాలయం
వరంగల్లు - 506 009

# తపన

- నర్సింగోజు లక్ష్మయ్య

నా కళ్లు ఆకాశంలోకి చూస్తున్నాయి............పరిశీలనతో
నా గుండె వేగంగా కొట్టుకుంటుంది.......... పరధ్యానంతో
నాలోని ప్రతి అణువు కంపిస్తుంది.......... అంతులేని ఆవేశంతో
మనసు ఆరాట పడుతుంది.......... ఆవేదనతో
ప్రతి నిత్యం జీవన పోరాటంలో
ఎదలోయల్లో భావ పరంపరలు, ప్రతిధ్వనిస్తున్నాయి
'స్వార్థం' నిప్పురవ్వలతో  చెలగాటమాడుతుంది
'అసూయ' దానికి ఆజ్యం పోస్తుంది
'కలిమి' బంధాల్ని త్రెంచుతుంది
'ద్వేషం' దివ్య దేవతగా వర్ణించబడుతుంది
'ప్రతిభ' నడిబజారులో పతితయై తిరుగుతుంది
'మౌనం' జీవిత సత్యాన్ని భరించలేనంటుంది
'ఆవేశం' అవధులను దాటుతుంది
'ఆగ్రహం' చండ్ర నిప్పులను కురిపిస్తుంది
'ఆలోచనల' అలలు సముద్రాన్ని కలచి వేస్తున్నాయి
అయినా. .
ఆశ నిరాశల ఎత్తు పల్లాల్ని దాటి,
చైతన్య పథ మార్గగామి నవుతున్నాను

తెలుగు పండిట్
సి.యస్.ఐ. మిషన్ హై స్కూల్
పరకాల, వరంగల్ జిల్లా - 506 164

# ఉగాదీ! స్వాగతం

- కె. రామలక్ష్మి

ఈ వసంతాగమనవేళ
ఈశ్వర నామధేయంతో
ఉత్సాహంగ వచ్చిన ఓ ఉగాదీ
నీకిదే మా స్వాగతం
ఎవరి గొడవవారిదే
ఎవరి తీరు వారిదే అయిన
మా యాంత్రిక జీవనంలో
లోపించిన సహజత్వాన్ని గమనించి
పర్వదినపు ప్రత్యేకతను గుర్తు చేయడానికి
పనిగట్టుకొని వచ్చావా
కోకిల పాటల కమ్మదనాన్ని
మామిడి పూతల చక్కదనాన్ని
ఆస్వాదించి పులకించలేని
మా మానసిక స్థితిని సరిదిద్దడానికి
సమయం చూసుకొని వచ్చావా
ఇంటింటా ఉన్న సమస్యల తోరణాలను విప్పి
మామిడాకుల పచ్చదనంలోని మంచితనాన్ని సూచించడానికి
మందహాసంతో వచ్చావా
తీపి పులుపు చేదు వగరుల
సమ్మిళితమైన భావాలతో
ఆనందంతో పాటు కష్టనష్టాలు కన్నీళ్లను తట్టుకునే
శక్తినిచ్చే ఉద్దేశ్యంతో ఉద్వేగంగా వచ్చావా
గతాన్ని స్వగతం చేసుకొని
కొత్తవత్సరంలో కొంగొత్త ఆశలకు పునాది వేసి
భవిష్యత్తు వైపు సాగమని కర్తవ్యాన్ని ప్రబోధించడానికి
ప్రమోదభరితవై వచ్చావా
ఓ ఉగాదీ నీకిదే మా స్వాగతం

5-10-86, కిషన్‌పుర
హన్మకొండ - 506 001

# సమైక్య జ్యోతిని వెలిగిద్దాం

- భరణి మాదిరాజు

భాషా జ్యోతుల భావ చిత్రాల్లో- - - -
భరత జాతి అమర వీరుల ఆశయాల్లో - - -

మతాల పేరిట మారణ హోమాలు,
కులాల పేరిట కార్చిచ్చులు,
జాతి నేతల హృదయాల్లో రగులుతూనే ఉన్నాయి.

హత్యలు, దోపిడీలు, దహన కాండలు
అనుక్షణం అగుపిస్తూనే ఉన్నాయి

ఆడపడచులపై అఘాయిత్యాలు, అత్యాచారాలు
నిత్యం నన్ను నిలదీస్తూనే ఉన్నాయి

అందుకే.....

మారణ హోమాలు, కార్చిచ్చులు, అత్యాచారాలు, అఘాయిత్యాలు
అంతం చేయడానికి
సమైక్య సమర శంఖం పూరించు

కలం, హలం, బలం ఒక్కటిగా
కులం, మతం, దేశం ఐక్యంగా
అనుక్షణం మనం జనం సాగిపోదాం
జన జాగృతి చైతన్య పథంలో - - -

భాషా జ్యోతుల భావ చిత్రాల్లో - - -
భరత జాతి అమర వీరుల ఆశయాల్లో- - -
సమైక్య జ్యోతిని వెలిగిద్దాం,
నవ భారతిని నిర్మిద్దాం.

కవితా నిలయం,
మల్లారెడ్డి పల్లివీధి, పోస్టు పరకాల
జిల్లా: వరంగల్ - 506 164

# ప్రకృతి

- నందనం కృపాకర్

ఓ మనిషీ - - - - -!

శ్రద్ధగా పరికించు ఈ ప్రకృతిని
బుద్ధిగా మార్చుకో నీ ప్రవృత్తిని
ప్రకృతి నీ కందిస్తున్నా - - - సర్వం
దాన్ని అంతం చేయడమేనా - - - నిత్యం

ఓ మనిషీ - - - తగదు నీకింత గర్వం
ఇకనైనా మారకపోతే ముగుస్తుంది నీ పర్వం
ప్రకృతి ప్రాణవాయువును, జీవజలాన్ని - - - సర్వం నీకిస్తుంది
తన వాడిగా, తన వారసుడిగా నిన్ను సంరక్షిస్తోంది

అందుకు ప్రతిగా, ఆధునిక మేధావిగా నీవేం ఇస్తున్నావు
ఈ ప్రకృతినే ప్రదూషణానికి గురి చేస్తున్నావు
నీ భవితను భవ్యంగా ఊహించుకుంటున్నావు
ఇకనైనా మారకపోతే నీ ప్రకృతి
సదా సర్వత్రా చేస్తుంది వికృతి

విజ్ఞానాన్ని ప్రకృతి రక్షణ, ప్రపంచ రక్షణకే వినియోగించాలి
నీ క్షేమం అవని క్షేమం పైనే ఆధారపడిఉందని గ్రహించాలి
లేదా - - - అంతా క్షామమే.

1-49/1, వెంకటాద్రినగర్
కాజీపేట్-506 003

# గర్వకారణం - - -!!?

- ముడుంబై వరదాచార్య:

ఏ యెడఁ జూచినన్, కరుణయింతయు, లేని దురాత్మకుల్ మరే
యే యెడఁ జూచినన్, రమణి యేడ్పులు, దారుణ భ్రూణహత్యలు
న్నేయెడఁజూచినన్, కడునికృష్టప్రజీవన మీడ్చు మానవుల్
యే యెడఁగానరావు మఱి, యెండిన డొక్కలు, నస్థిపంజరాల్ ॥

నేనయొనర్తు నీభువిని నేర్చుతొ, స్వర్గమునాగనుండు, మీ
యానయటంచు బల్కుదురు, నారితొ నొక్కని మీరి యొక్కడున్
కానగ రారునెన్నడును, కామితమేమిటొ కానలేని, యీ
మానవచిత్రముల్ మనిన, మాకౌనగూడునె మంచిరోజులున్ ॥

మావిచిగుళ్ళు తేటిగమి, మారుని రాకయు, గండుకోయిలల్
తావులుగుత్తుమల్లెలును, తథ్యముగా గనవచ్చు వింతయౌ
ధీవితెరంగు నీ వసుధ, దృష్టము మున్నివి, యేమివీనితో
కావలెగాని యీ నరులు, కల్మషముక్తులు ప్రేమమూర్తులున్ ॥

ఇం.నెం. 1-686, నర్సంపేట,
వరంగల్లు - 506 132

# తరం, తరం - సగం, సగం ?

- పల్లేరు వీరస్వామి

కలిసి నడిచే మనం - కాదులే చెరిసగం
సతి దేవుడను నేను - చరణదాసివి నీవు
ఆధిపత్యము నాది - నాదేను పై చేయి
ధర్మపత్నివి నీవు తలకొంత దించేయి
చంద్రమతివని నిన్ను వీధిలో అమ్మెదను
సీతమ్మవని చెప్పి నట్టడవి నెట్టెదను
ద్రౌపదివి నీవంటు జూదంలో ఒడ్డెదను
రేణుకవె నీవంటు సంతుతో నరికింతు
పాతివ్రత్యము నీకు పరమ భూషణము విను
పదహారు వేల మందిని నేను పొందెదను
స్వీయగా, అన్య, సామాన్యగా నిను పిలుతు
వంశాన్ని నిలబెట్టడమె కదా నీ వంతు
నటి, సఖీ దాసిగా దాదిగా దూతికగ
నీ జాతి తోడనే నిను తార్చ జూచెదను
ననుగనీ పెంచేటి సామర్థ్యమెంతున్న
'అబల'వని నిన్ను నే అపహాస్య మొనరింతు
సిగ్గు లజ్జా శీల సంస్కార మొద్దికలు
తగునమ్మ, నీకసలు, తరుణి యని నీ నగలు
నా పనులు ఏకరిస్తే, తలుచుకొని ఏడుస్తే
'ముగ్ధవే' నీవంటు ముచ్చటగ పిలిచెదను
నీవు మరణించగ ఇంకొకతె నాకు సతి
నేను చనిపోతేను 'సతి' వంటు నీకు చితి.

పరకాల
వరంగల్ జిల్లా - 506 164

# నిజం నా నైజం

మార్క సంపత్ కుమార్

నిజం నా నైజం నిజాయితీనెప్పుడూ
గౌరవిస్తా నిజం నిజం
నేనెప్పుడు బాదలలో బందీనే
బ్రతుకంతా భారంగా మోస్తున్నా
మొదటి తరగతి మోతు బరినే
కళ్ళు తెరిస్తే కళ్ళల్లో కన్నీళ్లే
కళ్ళు మూస్తే కలల్లో కన్నీళ్లే
రాళ్ళులేని ఈ కన్నీళ్ళతో
రాలలేని ఈ జీవితంతో
ఇంకెన్నాళ్లని మోస్తానో
ఈ జీవితాన్ని మోయాలని లేకున్నా మోస్తున్నా...
అందరూ నా వాళ్లేననే - నా నైజం- --
మరి - - - నిజాయితికి శాపమా !?

పోరండ్ల కైలాసం కాంప్లెక్సు, నగరవీధి
పరకాల - [illegible] 164
వరంగల్ జిల్లా

# శిశువు

- మాడుగుల భాస్కర శర్మ

అమూల్య దివ్య స్వరూపం
అమలిన ప్రకృతి స్వభావం
అద్భుత నవలావణ్యం
అసలెవరో ఎవరో నీవు ? ఓనవజాతశిశువా !
అమ్మకోరికల ప్రతిరూపమా,
అతికోమలమగు మణిదీపమా
అనుక్షణం ఏదారి దొరికితే అటుగా నడిచే నిర్ఘర నీరమా !
అర్థం తెలియని నవ్వుల్లో
అతి విచిత్రమగు హాసంలో, ఏ రాగం, గీతం దాగుందో ?
ఏ స్వప్నంలో విహరిస్తావో
ఏ గగనంలో పయనిస్తావో
ఎవరో తెలియక నీలో నీవే ఏడుస్తూనే ఉంటావు
అప్పటి వరకే శిశువు(గ)
ఆ తర్వాత- - - - ?
ఈ లోకం పోకడ చాలా వింత
ఈ రోజే తెలియదు ఏ కొంతా
నీకొక పేరూ, నీదొక ఊరూ
సోషల్ స్టేటస్, అన్నీ పెట్టీ మన్నిస్తారు
అసలైన మోసం నేర్పిస్తారు
అప్పుడు నీవూ మాలో ఒకడివి.

జవహర్‌లాల్‌నెహ్రూ నవోదయ విద్యాలయం
హసన్‌పర్తి, వరంగల్ జిల్లా - 506 371

# మరీచిక

- అనంతమల్లయ్య.వి

ఉరుకులు - ఉరుకులు

ఉరుకులు - ఉరుకులు

ఏదో పడేసుకున్నట్టు

ఎవరో తరుముతున్నట్టు

ఆపద వాటిల్లినట్టు

జీవన సారమంతా లాగేసినట్టు

ఉరుకులు -- ఉరుకులు

సుళ్ళు సుళ్ళుగా తిరుగుతూ

ఆలోచనా ల్లోచనాల్లో సుడిగుండాలవుతూ

అన్నీతనే అవుతూ

రూపవైరూప్యాలకు

చపలిస్తూ - ఔపాసించినట్టు

ఎండమావులను తాగేసినట్టు

ఉరుకులు -- ఉరుకులు.

కాజీపేట,

వరంగల్లు - 506 003

# బరువు కథ

డా॥ కె.యల్.వి. ప్రసాద్

సామాన్యుడి బ్రతుకు
"ఏ.సి" గదుల్లో
సీసా చప్పళ్ళలో
అందెలచిందెల్లో
అందమయిన 'నవల'గా
పురుడుపోసుకుంటుంది
బడుగువాడు అడుగుపెట్టలేని
అయిదు నక్షత్రాల
చలువ మందిరాల్లో
అది - ఆవిష్కరణ
వలువలు విప్పకొంటుంది
తళుకు బెళుకుల
మోసాల మార్కెట్టులో
ఇది-సామాన్యుడికి
అందని-
ద్రాక్షపండే అవుతుంది !!

అధ్యక్షులు
సహృదయ
సాహిత్య సాంస్కృతిక సంస్థ
8-9-110, కిషన్‌పుర,
హనుమకొండ - 506 001.

"సంరక్ష" దంతవైద్యశాల
గోకుల్‌నగర్, పాతబస్‌డిపో రోడ్,
హనుమకొండ, వరంగల్

# "సింహావలోకనం"

- పల్లెసేను

స్వ--భావం--స్వ--తంత్రం
స్వభావ స్వతంత్రం
అదే--స్వతంత్ర భారతం
సూదిమొన వాసిగా - సూచక జనాధికారికంగా
స్వతంత్రం అంటే - స్వంత తంత్రమనే అర్థమేమో !
ప్రజా సౌకర్యం కోసం - ఐక్యత వుంటే !
ఖనిజాల్ని తోడవచ్చు - ఖగోళాన్ని దర్శించవచ్చు
నదులన్నీ మళ్లించవచ్చు - నవధాన్యాల్ని పండించవచ్చు
ఫ్యాక్టరీలు - బ్యాంకులు నిర్మించనూ వచ్చు
నీ క్రింద వున్నా సోదరుడినే
స్వతంత్రం - నీకే వుందనుకోను
నీ పంపుమర ఎక్కువ త్రిప్పితే
నాకు నీళ్ళురావు - స్నానం చేయలేను
నీ మిల్లుకు కరెంటు వాడితే
నాయిల్లుకు సరిపోదు - నా పంఖా తిరుగదు
ఇలా ! నేను స్నానం లేక చెమటపట్టితే
కనీసం గాలి లేక ఉక్కపోస్తే,
బిక్క చచ్చి వూరుకోవాలా
బెదిరి చూసి పారిపోవాలా !
అలాకాదు!
"ధనం" నిల్వ - "మనం" నిల్వ
దక్షతగా - ధర్మంనిల్వ
నియమంగా - నీతి నిలువ
అదే -- మన ప్రగతికి విలువ

నేరేడుపల్లి వయా : మల్లంపల్లి
జి॥ వరంగల్ - 506 349

(ఆల్‌మెట్టి వివాదం పై స్ప... )

# మమత

- మొహమ్మద్ నహాజ్ అలి

దారుణ మారణ
హోమం జరిపిన
నరుని గుండెలో 'రేపు'
మమత చేపుతుంది.

జాతికి,జాతికి
మధ్య నున్న
కృత్రిమ గీతాల్ని
రూపుమాపుతుంది.

ఏనుగు పాలిటి
మావటి కైవడి
అణువు నందలి
అనంత శక్తిని
హస్తగతం చేసుకొని
అడుగడుగున
మనుగడ కోసం
తడబడుతున్న
బడుగు దేశాలను సహితం
క్రీడా సరోవరాలుగా మార్చుతుంది

8-22, నేతాజీ వీధి,
నర్సంపేట, వరంగల్ జిల్లా - 506 132

# ఉనికి

- ఎ.వి. నర్సింహా రావు

పొరుగింటి పుల్లకూరను మెచ్చుకోవడం
నా కలవాటయింది -
నా వంట్లో రక్తం పరుగులెడుతున్నా
మరొకరు గుర్తు చేసే దాకా
దాని ఉనికి గుర్తుకు రావడం లేదు !
రెండు సంధ్యల మధ్య
కుమ్మరి మట్టిలా నలుగుతున్నా
బానిసత్వపు వాసనలు నాసికలకు చేరడం లేదు!
కూలిపోయిన గుడిసెలు
కుళ్ళిపోయిన శవాలు గుర్తు చేస్తే తప్ప
వచ్చిన తుఫాను సాంద్రత
అర్థం కావడం లేదు -
కడుపులో జ్వలించే ఆకలి మంటలకు
మరొకడు ఆజ్యం పోస్తే తప్ప
వేడి వాడి బయటపడడం లేదు !
విదేశీయులు మీటలు నొక్కేదాకా
నా మేధస్సు తలుపులు తెరుచుకోవడం లేదు
పేటంటుల ముద్రలు పడడం లేదు -
అరువు తెచ్చుకున్న మాటలే
నాలోంచి వెలువడే అక్షర శబ్దాలు
పనికి రాకుండా చెత్తబుట్టల్లో దాక్కున్న
ఆలోచనలకు, ఆచరణలకు అవే మార్గదర్శకాలు
నేను ఎంతగా ఒదిగిపోయానో తెలుసా!
పరాయి నీడల్లో ఒదిగిపోయి
నాకు నేను గుర్తు పట్టుకోలేనంత !

గాంధీనగర్, పోచమ్మకుంట
హన్మకొండ - 506 001

# విశ్వమెంత వింత కనవె లేమ !

- పి. కృష్ణకుమారి

చదువుకొమ్మనుచు తలిదండ్రి చక్కగా బడికంప
చదువుపేరిట కొడుకు చాల నేర్చు
పంతుళ్ళ పాలిట ప్రాణాంతకమ్మగును
పార్టీల పేరిట పలురుచులు మరుగును
ఉద్యమమ్మని తిరుగు ఊర రౌడీయగును
కొరగాని కొడుకుల చదువులింతేగదా
విశ్వమెంత వింత కనవె లేమ !
కూతుళ్ళు కుంపట్లని రోసి రోసి
కొడుకును గారాన పెంచేరు తలిదండ్రి
కొరివైన కొడుకు తన్ని పంపిన వేళ
ఆదరించెడి తల్లి కూతురే యగును
విశ్వమెంత వింత కనవె లేమ !
అప్పో సప్పో చేసి ఆడపిల్లనొక అయ్యచేతబెట్ట
కట్నమేది మరి కానుక లేవనుచు
అత్తమొగుడాడ్డడుచులాపిల్ల నేడ్పించి పడ్డించి
సాగనంపుదురామెను ఆత్మహత్యల దారుల
విజ్ఞాన యుగములో వింత ఇదియె లేమ !
ఉద్యోగముంజేస్తు ఇంటి ఊడిగమునూజేస్తు
ఈసడించెడి మగడె ఈశుడని కొలుచుచు
ఆత్మ జ్ఞానులై మసలు అతివలుందురు కొందరు
చదువు, సంపాదన, సిరి సంపదలు గలిగి
అతిగారవించెడి పతియునూ ఉండగా
ఏదో లేదనుచు నేడ్చి, తనవారి నేడ్పించు
తృప్తినెరుగని తరుణులుందురింకొందరు
విశ్వమెంత వింత కనవె లేమ !

ఐబి-3, కె.యం.సి. స్టాఫ్ క్వార్టర్స్
వరంగల్లు - 506 007

# అద్భుతం అక్షరం

- జి. ప్రభాకర స్వామి

అనంతం
అసంఖ్యం
అక్షర నక్షత్రం.

విజయం
మృత్యుంజయం
అక్షర విత్తనం.

పుటలై
పుస్తకమై
కావ్యమై
ప్రబంధమై
పురాతనమై
పురుడు బోసుకుంటుంది
అధునాతన అవతారానికి.

5-8-143/డి, కిషన్‌పుర
హన్మకొండ - 506 001

Eeshwara a collection of poetry - edited by
Dr. T. Sriranga Swamy, Warangal - 506 009

## మా ప్రచురణలు

| | | | |
|---|---|---|---|
| 1. | శ్రీరామ శతకము - శ్రీ టి. రామానుజస్వామి | రూ. | 10-00 |
| 2. | కవితాగానం - శ్రీమతి టి. ఇందిరా చిరంజీవి | రూ. | 3-00 |
| 3. | ద టు జెంటిల్ మెన్ ఆఫ్ వెరోనా - డా॥జి. దామోదర్ తెలుగు అనువాదం | రూ. | 5-00 |
| 4. | వేణు తరంగాలు - యల్. వేణుగోపాల రావు | రూ. | 5-00 |
| 5. | ప్రభవ (కవితా సంకలనం) - శ్రీ టి. శ్రీరంగస్వామి (సంపాదకత్వం) | | ఒక సహృదయం |
| 6. | వరంగల్లు జిల్లా రచయితల వాఙ్మయ జీవిత సూచిక శ్రీ టి. శ్రీరంగస్వామి | రూ. | 15-00 |
| 7. | కవితావనం - శ్రీమతి టి. ఇందిరా చిరంజీవి | రూ. | 6-00 |
| 8. | జన్మభూమిసిరులు - శ్రీ పల్లె సీను | రూ. | 6-00 |
| 9. | జీవన రాగాలు - శ్రీయల్. వేణుగోపాల రావు | రూ. | 10-00 |
| 10. | శుక్ల (కవితా సంకలనం) - శ్రీ టి. శ్రీరంగస్వామి (సంపాదకత్వం) | రూ. | 5-00 |
| 11. | ఎమ్మెస్సార్ కథలు - శ్రీ యం. సుబ్బారావు | రూ. | 9-00 |
| 12. | ప్రమోదూత (కవితా సంకలనం) - శ్రీ.టి. శ్రీరంగ స్వామి (సంపాదకత్వం) | రూ. | 6-00 |
| 13. | నా మాట (శతకం) - శ్రీ యం. సుబ్బారావు | రూ. | 3-00 |
| 14. | ఏకశిల వైతాళికులు (వ్యాస సంకలనం) - శ్రీ టి. శ్రీరంగ స్వామి | రూ. | 30-00 |
| 15. | ప్రజోత్పత్తి (కవితాసంకలనం ) శ్రీ టి. శ్రీ రంగస్వామి (సంపాదకత్వం) | రూ. | 6-00 |
| 16. | కోవెల సుప్రసన్నాచార్యులు వాఙ్మయ జీవిత సూచిక - శ్రీ టి. శ్రీరంగ స్వామి | రూ. | 15-00 |
| 17. | కావ్యం - కవిస్వామ్యం - శ్రీ కోవెల సంపత్కుమారాచార్యులు | రూ. | 30-00 |
| 18. | విశ్వనాథవారి కృష్ణ కావ్యాలు - డా॥ టి. శ్రీరంగస్వామి | రూ. | 60-00 |
| 19. | నిరంతరం (కవితా సంపుటి) - డా॥ టి. శ్రీరంగస్వామి | రూ. | 10-00 |
| 20. | మాధవ మాధుర్యం (కృష్ణతత్త్వ వీచిక) - శ్రీ పల్లె సీను | రూ. | 26-00 |
| 21. | ఈశ్వర (కవితా సంకలనం) - డా॥ టి. శ్రీరంగస్వామి (సంపాదకత్వం) | రూ. | 10-00 |

Estd. 1977 Regd. No. 2337/89
A Publication of Sri lekha Sahithi, Warangal - 506 009
UGADI 1997 · Price. Rs. 10/-

Sri Shanthi Offset Printers, HNK. PH: 79541